




## ధీర నరేంద్రుడు

నరేంద్రనాథ్ దత్త అని చిన్నతనంలో పిలువబడిన వివేకానంద స్వామి యొక్క 150వ జయంతిని ఈ 2013-2014 సంవత్సరంలో జరుపుకుంటున్నాము. ఆయన జీవితం మనందరికీ ఆదర్శం. ముఖ్యంగా ఆయన బాల్యం పిల్లలందరికీ ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంటుంది. ఆ విశేషాలను ఇప్పుడు తెలుసుకుందాం.

# 1. జననము

మన దేశంలో కలకత్తా (కోల్‌కతా) ఒక మహాపట్టణం. అక్కడి సిమ్లా అనే పేటలో విశ్వనాథ దత్తా, భువనేశ్వరీ దేవి దంపతులు నివసించేవారు. విశ్వనాథ దత్తా చాలా పేరు గడించిన న్యాయవాది. ఎంతో ఉదారస్వభావం కలవాడు. భువనేశ్వరీ దేవికి దైవభక్తి మెండు. కాలక్రమేణా వారికి నలుగురు కుమార్తెలు కలిగారు. తమకు ఒక కుమారుడు కూడా జన్మిస్తే బాగుండునని వారు కోరుకున్నారు. ఎన్నో పూజలు, వ్రతాలు ఆచరించారు. ఇందు కోసమే భువనేశ్వరీ దేవి కాశీలో ఉన్న విశ్వనాథుణ్ణి ప్రత్యేకంగా ప్రార్థించేది కూడా.



అది 1863వ సంవత్సరం జనవరి 12వ తేదీ సోమవారం, మకర సంక్రాంతి పుణ్యదినం. ఆ రోజున వారి ప్రార్థనలు ఫలించి, ఒక మగ బిడ్డ జన్మించాడు. వారి సంతోషానికి మేర లేదు. కాశీ విశ్వనాథుడే తమ ఇంటిలో పుట్టాడని వారు భావించారు. కుమారుణ్ణి 'వీరేశ్వర్' అని పిలువసాగారు. బెంగాలీ భాషలో 'వ', 'బ' అనే అక్షరాలను ఒకే విధంగా ఉచ్చరిస్తారు. అందువలన వీరేశ్వర్ అనే పేరు బీరేశ్వర్ గానూ, చివరకు 'బిలే' అనే ముద్దుపేరుగానూ మారిపోయింది!

అతడు పుట్టుకతోనే కాంతి మంతమైన పెద్దపెద్ద కన్నులు, గుండ్రని ముఖం, బొద్దుగా ఉన్న శరీరం కలిగి ఉండేవాడు. అందుచేత అతణ్ణి చూచిన వారందరూ ఎంతో ఆకర్షితులయ్యేవారు.

అతణ్ణి చూస్తేనే అందరికీ అపరిమితమైన ఆనందం కలిగేది. ఇక భువనేశ్వరీ విశ్వనాథుల సంగతి వేరే చెప్పాలా? కొంతకాలం తరువాత అతనికి 'నరేంద్రనాథ్' అని నామకరణం చేశారు. ఆ మాటకు మానవులందరికీ రాజు అని అర్థం.

ఒక్క భారతదేశానికి మాత్రమే కాక, ప్రపంచానికే వెలుగు ప్రసాదించిన మహానుభావుడు ఉద్భవించిన ఆ రోజు ప్రపంచంలో ప్రతివొక్కరికీ మరచిపోలేని రోజు. అందుచేతనే, జనవరి 12వ తేదీని 'జాతీయ యువదినోత్సవం'గా భారత ప్రభుత్వం ప్రకటించింది. వివేకానంద స్వామిగా కీర్తికెక్కిన నరేంద్రుడు దేశంలోని యువతకు సర్వోత్తమ ఆదర్శం. అతడు జీవితంలో ఏమేమి చేశాడో మనం తెలుసుకోవాలి. అతడి బోధనలను శిరసావహించడం ద్వారా దేశాన్ని ముందుకు నడిపే బాధ్యత బాలబాలికల మీదా, యువతీయువకులందరి మీదా ఉంది. ఆ విధంగా నరేంద్రుడి జన్మదినం మనందరికీ పండుగ రోజు.

**క్రాంతినిడుటకు మకర సంక్రాంతినాడు**
**నాతి భువనేశ్వరీ విశ్వనాథులకును ।**
**బాలభాస్కరు రీతి నుద్భవమునందె**
**కాశి విశ్వేశ్వరాంశ వారాశి నుండి ॥**

✦ ✦ ✦ ✦ ✦



## 2. అపర శివుడు : నరేంద్రుడు

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందంటారు. అలాగే నరేంద్రుడు బాల్యంలోనే తన ప్రత్యేకతను తేటతెల్లం చేశాడు. చిన్నప్పుడు అతడు చాలా అల్లరి చేసేవాడు. భువనేశ్వరీ దేవి ఆ అల్లరిని భరించలేకపోయేది. ఒక్కొక్కసారి విసిగిపోయి, "కొడుకును ఇమ్మని నేను ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తే, ఆయన కొడుకునివ్వడానికి బదులు తన భూతగణాలలో నుంచి ఒక భూతాన్ని నా దగ్గరకు పంపించాడు" అనేది. అయితే, "బిలే శివుడి అంశతో పుట్టాడు కదా! మరి శివుడికి అభిషేకం అంటే ఇష్టం. అందువలన 'శివ శివ' అంటూ అతడి నెత్తిన నీరు పోసి చూస్తాను! బహుశా అలా చేస్తే అల్లరి మానేస్తాడు!" అనుకుంది. అలా 'శివ శివ' అంటూ అతడి తల మీద నీరు పోసినప్పుడు, చిత్రంగా నరేంద్రుడు అల్లరి మానివేసేవాడు!



అతడి అల్లరి మానిపించడానికి భువనేశ్వరీ దేవి మరో పద్ధతి కనిపెట్టింది. "నువ్వు ఇలా అల్లరి చేస్తూ వుంటే, శివుడు నిన్ను కైలాసం లోనికి రానివ్వడు!" అని బెదిరిస్తే కూడా అతడు అల్లరి మానివేసేవాడు!

ఈ అల్లరికి తోడు బిచ్చగాడు ఎవరైనా కనిపిస్తే చాలు, తాను కట్టుకున్న బట్టలు తీసి ఇచ్చి వేసేవాడు! అవి ఎంత ఖరీదువైనా సరే! ఇలా అన్నీ ఇచ్చేస్తు న్నాడని కోపగించి, ఒక రోజు భువనేశ్వరీ దేవి అతణ్ణి మేడ మీద గదిలో పెట్టి

తలుపు వేసింది. సరిగా అప్పుడే చలికి వణుకుతూ, ఒక బక్కచిక్కిన బిచ్చగాడు క్రింద నుంచి అరవసాగాడు. కిటికీలో నుంచి ఆ బిచ్చగాణ్ణి చూసిన బిలే ఎంతో జాలిపడ్డాడు. అక్కడ పెట్టెలో ఉన్న బట్టలు బయటకు తీసి, ఆ కిటికీలో నుంచి బిచ్చగాడి కోసం బయట పడవేశాడు. ఆ బిచ్చగాడు అవి తీసుకుని దణ్ణం పెడుతూ సాగిపోయాడు. చిన్నప్పటి నుంచీ అటువంటి జాలి గుండె కలిగిన వాడు బిలే. దానికి తోడు, తన సొంతానికి ఏమీ ఉంచుకోని వైరాగ్యం, ఇతరుల కోసం సర్వాన్నీ ఇచ్చివేసే త్యాగ గుణం అతడిలో మనం చూసి నేర్చుకోవలసిన గొప్ప లక్షణాలు.



సర్వసంగములను సన్న్యసించిన శివుడు
భక్త జనుల కీడె బరగ సిరులు ।
అటులె పేదకిచ్చు అపర శివుడు బిలె
తనదు ఉడుపులెల్ల, తల్లివైన ॥

✦ ✦ ✦ ✦ ✦

## 3. అపర బుద్ధుడు : నరేంద్రుడు

నరేంద్రుని కళ్ళు చాలా పెద్దవి. అవి అందంగానూ, ఆకర్షణీయంగానూ, తెలివి తేటలతో నిండివున్నట్లుగానూ కనపడేవి. అతడి కళ్ళు మూసివున్నా ఎంతో అందంగా ఉండేవి. చిన్న వయసులోనే అతడు తరచూ ధ్యానం చేసేవాడు. ఒక రోజు తన తోటిపిల్లలనందరినీ ఒక కొత్త ఆట ఆడదామని పిలిచాడు. అది "ధ్యానం చేయడం" అనే ఆట! వాళ్ళందరినీ మేడ మీదకు తీసుకువెళ్ళాడు. తనతోపాటు కదలకుండా కూర్చొని ధ్యానం చేయమన్నాడు. పిల్లలందరూ అలాగే కూర్చున్నారు.

అల్లరిలో మాత్రమే కాదు, ధ్యానం చేయడంలోనూ నరేంద్రుడు దిట్ట. అలాగే మనం కూడా, అల్లరి చేయడానికీ, ఆటలాడడానికీ ఎంత ఉత్సాహాన్ని చూపుతామో, అంతే ఉత్సాహంతో మనస్సును నిశ్చలంగా ఉంచడం ఎలాగో కూడా నేర్చుకోవాలి. దాని కోసం కదలకుండా కూర్చోవడం నేర్చుకోవాలి, ఒకే విషయాన్ని గురించి ఆలోచించడం నేర్చుకోవాలి. ఒక పని చేస్తున్నప్పుడు, మనస్సంతా దాని మీదే ఉండాలి. చేసే పనిని మరిచి పోయి, దిక్కులు చూడకూడదు.



ధ్యానం ఆట మొదలైంది. వాళ్ళందరూ చిన్నపిల్లలు కదా. అందువలన మధ్య మధ్యలో కళ్ళు తెరిచి అటూఇటూ చూస్తున్నారు. కానీ నరేంద్రుడు మాత్రం కళ్ళు మూసుకుని, నిశ్చలంగా కూర్చుని ఉన్నాడు. ఇంతలో అక్కడికి ఒక పాము వచ్చింది. దాన్ని చూస్తూనే పిల్లలందరూ, "పాము, పాము" అని అరుస్తూ చెల్లాచెదురుగా పారిపోయారు. ఆ పాము అక్కడే కొంచెం సేపు అటూఇటూ తిరిగి, ఆ తర్వాత మెల్లగా వెళ్ళిపోయింది. నరేంద్రుడికి ఈ పాము వచ్చినట్టే తెలియదు. అతడి మనస్సు నిశ్చలంగా ధ్యానంలో నిలబడిపోయి ఉంది.



ధ్యానమాటలాడు తక్కిన బాలురు
పాము వచ్చెననుచు పారిపోవ ।
సిద్ధుడైన అపర బుద్ధుని వలె బిలె
కదల లేదు కన్ను కదపలేదు ॥

✦ ✦ ✦ ✦ ✦

## 4. సీతారాములు - జాతికి ఆదర్శం

రామాయణం, మహాభారతం మనకు గొప్ప గ్రంథాలు. అందులోని ముఖ్యపాత్రలు మన జాతికి ఆదర్శప్రాయమైనవి. అందువలన, వాటిలో నుంచి కథలను ఏర్చికూర్చి భువనేశ్వరీ దేవి చిన్ననాడే నరేంద్రుడికి చెప్పేది. వాటిని వింటూ నరేంద్రుడు నిద్రపోయేవాడు.

నరేంద్రుడికి శ్రీరాముడు ఎంతో నచ్చాడు. రాముని విగ్రహం తెచ్చి తన గదిలో పెట్టి పూజించ సాగాడు. క్రమంగా రాముణ్ణి చూడాలనే కోరిక అతడికి కలిగింది.



దాని కోసం తన అమ్మనే సలహా అడిగాడు.

ఆమె నరేంద్రుడితో, "హనుమంతుడు రామునికి పరమ భక్తుడు. అతణ్ణి పరిచయం చేసుకుంటే, అతడి ద్వారా రాముణ్ణి చూడవచ్చును" అని చెప్పింది. "మరి హనుమంతుడు ఎక్కడ ఉంటాడమ్మా?" అని అమ్మని అడిగాడు బిలే. "అరటి తోటలలో!" అని ఆమె బదులు చెప్పింది. హనుమంతుణ్ణి వెతకడం కోసం ఒక రోజు ప్రొద్దున్నే అతడు ఇంటి నుంచి బయలు దేరి సాయంకాలం దాకా అరటి తోటలలో వెతుక సాగాడు – ఇంటికి రాలేదు. భువనేశ్వరీ దేవి అతడి కోసం వెతికించింది. చివరకు తానే అతణ్ణి ఒక అరటితోటలో వెతికి పట్టుకుంది. అయితే, హనుమంతుణ్ణి చూస్తే కానీ ఇంటికి రానని బిలే మొండిపట్టు పట్టాడు. "శ్రీరాముడు పని చెపితే ఎటో వెళ్ళాడులే" అని నచ్చజెప్పి, మంకుపట్టుతో ఉన్న అతణ్ణి అతికష్టం మీద ఇంటికి చేర్చింది ఆమె.

నరేంద్రుడికి పెళ్ళి అంటే ఇష్టం లేదు. ఒకరోజు రాముడికీ, సీతకూ పెళ్ళయిందని తెలిసింది. వెంటనే రాముడి విగ్రహాన్ని తన గది నుంచి తీసివేశాడు. అమ్మ సలహా మేరకు, పరమశివుడు సన్న్యాసులకే సన్న్యాసి కాబట్టి ఆ స్థానంలో శివుడి విగ్రహాన్ని పెట్టి పూజించసాగాడు.

అయితే, నరేంద్రుడు పెద్దవాడయ్యాక సీతారాముల గొప్పతనాన్ని చక్కగా అర్థం చేసుకున్నాడు. వారి గొప్పతనాన్ని వివరిస్తూ, "సీతారాములు మన జాతికి ఆదర్శమూర్తులు" అని కీర్తించాడు. మన జాతి నరనరాలలో సీతారాములు ఇమిడి ఉన్నారనీ, మన దేశంలో సర్వం నశించి పోయి, చివరకు ఐదుగురు భారతీయులు మాత్రమే మిగిలినా, సీతారాముల కథ వారి మధ్య నిలచి ఉంటుందనీ అతడు ప్రకటించాడు. సీతాదేవి లాంటి స్త్రీమూర్తి ప్రపంచంలో మరెక్కడా కానరాదని బోధించాడు. తన జీవితమంతా స్త్రీలందరినీ తన తల్లులలాగా సంబోధించి, గౌరవించాడు. అలాగే శివపార్వతుల త్యాగమయ జీవనం మనకు ఆదర్శమని బోధించాడు.

**పెండ్లియాడె సీత ప్రీతితోడ రాము**
**డనుచు వారి విగ్రహాల దీసి ।**
**సకల సంగములను సన్న్యసించిన యతి**
**శ్రేష్ఠుడనుచు నిలిపె శివుని ప్రతిమ ॥**

✦ ✦ ✦ ✦ ✦

## 5. నాయకుడు : నరేంద్రుడు

నాయకుడు అయినవాడు పదిమంది అభిప్రాయాలనూ పరిగణనలోకి తీసుకుంటాడు. అంతేకాక పదిమందికీ హితవు కూర్చే విధంగా అందరికీ నచ్చజెప్ప గలుగుతాడు. నరేంద్రుడిలోని ఈ లక్షణాలను మనం కూడా నేర్చుకోవాలి.

వారికి ఒక గుర్రపు బండి ఉండేది. పెద్ద తలపాగా చుట్టుకున్న ఒక మనిషి దాన్ని నడిపేవాడు. ఆ బండి నడిపే పని నరేంద్రుడికి ఎంతగానో నచ్చింది. తాను కూడా అలాగే రథసారథి కావాలని అనుకున్నాడు.

నరేంద్రుడికి బాగా నచ్చిన ఆటలలో 'రాజదర్బార్' లేదా 'రాజసభ' ఆట ఒకటి. తాను ఒక చక్రవర్తిలాగా ఎత్తైన చోట కూర్చొనేవాడు. తన స్నేహితులలో కొందరిని మంత్రులు, సామంత రాజుల లాగా, మరికొందరిని ప్రజల లాగా వేర్వేరు ఎత్తులలో కూర్చోపెట్టేవాడు. వారందరూ ఎంతో గౌరవంతో చక్రవర్తి దగ్గరకు వచ్చి తమతమ కష్టసుఖాలను చెప్పుకునేవారు, తమ వివాదాలను అతడి ముందు ఏకరువు పెట్టేవారు! అవన్నీ శ్రద్ధగా విని, నరేంద్రుడు వారి సమస్యలను పరిష్కరించి, తీర్పులు కూడా చెప్పేవాడు!

ఒకసారి నరేంద్రుడు గంగానదికి పూజ చేయాలనుకున్నాడు. తన తండ్రి వద్ద కొంత డబ్బు తీసుకున్నాడు. చాలామంది పిల్లలను ప్రోగుచేశాడు. వాళ్ళకు గంగానదికి పూజ చేయడానికి ఏమేమి చేయాలో వివరించి, వారిని ఇరువైపులా బారులు తీర్చి నిలబెట్టాడు. వారికందరికీ పట్టుకోవడానికి జండాలు ఇచ్చాడు. తాను నాయకత్వం వహిస్తూ, భజనలు చేయిస్తూ వారందరినీ గంగానది వైపు నడిపించాడు. గంగానది చేరుకున్న తర్వాత, పూలు, పండ్లు అర్పించి, వారందరూ గంగానదిని అర్చించారు!

సాయంకాలం వారు మరలా అక్కడికి చేరుకుని, అరటిదొన్నెలలో దీపాలను అమర్చి, వాటిని గంగానదిలో వదిలారు. అలా చాలామంది పిల్లలు చేరి నీటిలో వదిలిన ఆ దీపాల వెలుగులో గంగానది చూడచక్కగా కనిపించింది.



అనాది నుంచీ మన పూర్వీకులు గంగానదిని ఎంతో పవిత్రమైనదిగా పరిగణించారు. 'గంగావారి బ్రహ్మవారి' అంటారు. (వారి అంటే నీరు. బ్రహ్మవారి అంటే బ్రహ్మ నీరు, దైవం ప్రసాదించిన నీరు అని అర్థం.) మన నాగరికతకు గంగానది చిహ్నం. గంగానది జన్మస్థానం అయిన గంగోత్రి మొదలుకుని, పర్వతాల మీద నుంచి దిగి, మైదానాలలో ప్రవేశించే చోటు అయిన హరిద్వారం, ఆ

తర్వాత అది సముద్రంలో కలిసే గంగాసాగర్ వరకూ దేశప్రజల చేత పూజింపబడుతూనే ఉంది. దాన్ని బాల నరేంద్రుడు చక్కగా గుర్తించాడు.

'రాజసభ'ను దీర్చి రాజును నేనని
తోటి సఖుల జేర్చి ఆటలాడె ।
బార్లు బార్లు దీర్చి బాలుర నడిపించి
'గంగపూజ' చేసి ఘనత గాంచె ॥

✦ ✦ ✦ ✦ ✦



## 6. తాకితే మతం పోతుందా?

నరేంద్రుడి తండ్రి విశ్వనాథ్ దత్త గొప్ప న్యాయవాది కావడం వలన రకరకాల మంది కోర్టు వ్యవహారాల కోసం ఆయన దగ్గరకు వస్తుండేవారు. వారిలో అన్ని కులాల వారు, మతాల వారు ఉండేవారు. ఇంటికి వచ్చిన అతిథులకు మర్యాద చేయడం భారతీయ సంప్రదాయం. అందువలన బెంగాలీ ఆచారం ప్రకారం ఇంటికి వచ్చిన వారు హుక్కా పీల్చడానికి వీలుగా ఆయన అనేక హుక్కాలను ఏర్పాటు చేశాడు. ప్రతి కులానికి, ప్రతి మతానికి వేర్వేరు హుక్కాలు ప్రత్యేకంగా ఉండడం వలన, ఎవరు వస్తే వారికోసం ప్రత్యేకంగా ఉంచిన హుక్కాను వారికి ఇచ్చేవారు. దానితో వారు పొగత్రాగేవారు.

నరేంద్రుడికి ఈ ఏర్పాటు అర్థం కాలేదు. ఇన్ని హుక్కాలు ఎందుకు అని అతడికి సందేహం కలిగింది. ఒకసారి అతడు తండ్రిని, "నాన్నా! ఎందుకు ఇన్ని హుక్కాలు పెట్టారు?" అని అడిగాడు. అందుకు తండ్రి, "నరేన్! ఒక కులం వాళ్ళు పీల్చిన హుక్కాను ఇంకొక కులం వారు పీలిస్తే వారి కులం చెడిపోతుంది. అలాగే ఒక మతం వారు పీల్చిన హుక్కాను మరొక మతం వారు పీలిస్తే వారి మతం చెడిపోతుంది!" అని చెప్పాడు. ఈ సమాధానం నరేంద్రుడికి తృప్తి కలిగించలేదు. కులం, మతం ఎలా చెడి పోతాయో పరీక్షించి చూడాలని అతడు అనుకున్నాడు.



ఒకసారి తండ్రి ఇంటిలో లేనప్పుడు వరుసగా ఒక్కొక్క హుక్కానే తీసుకుని పీల్చడం మొదలు పెట్టాడు. అన్నిటి రుచి ఒకే రకంగా ఉంది! ఇంతలో విశ్వనాథ్ దత్తా వచ్చి, "నరేన్! ఏమి చేస్తున్నావ్?" అని అడిగాడు.

వెంటనే నరేన్, "నాన్నా! నా కులం, మతం ఎలా చెడి పోతాయో చూద్దామని అన్ని హుక్కాలూ పీల్చి చూస్తున్నాను. అన్నింటినీ తాకినా నాలో ఏ మార్పూ రాలేదే? ఒకరి హుక్కాను మరొకరు పీల్చినంత మాత్రాన

కులం, మతం ఎలా పోతాయి?" అని ఎదురు ప్రశ్నించాడు. దానితో నిర్ఘాంతపోవడం విశ్వనాథ్ దత్తా వంతు అయింది!

నరేంద్రుడు పెద్దయిన తర్వాత, "కులం, మతం మొదలైనవన్నీ ప్రస్తుత కాలంలో మానవుల మధ్య పరస్పర సోదర భావాలను చెడగొడుతున్నాయి. పూర్వం వాటివల్ల కొంత మంచి జరిగిందేమో కానీ, ఈనాడు అవి మనుష్యుల పట్ల శాపాలుగా మారి, మానవులను రాక్షసులుగా మారుస్తున్నాయి. ఈ కులమతాల అడ్డుగోడలన్నింటినీ కూల్చివేయాలి!" అని బోధించాడు.

**వేరు వేరు కులము వారికై పెట్టిన**
**హుక్కలన్ని ఒక్క గుక్క పీల్చి ।**
**ఏమి? కులము, మతము, ఇంచుక చెడలేదె?**
**అనగ నతడు; తండ్రి యట్టె నిలచె ॥**

✦ ✦ ✦ ✦ ✦





## 7. పరీక్షిస్తే గానీ నమ్మడు - నరేంద్రుడు

ఆటలంటే పిల్లలకు ఎంతో ఇష్టం. అలాగే బిలే కూడా స్నేహితులతో కలసి పరిగెత్తే వాడు, చెట్లు ఎక్కేవాడు, దూకేవాడు. వాళ్ళ నాన్న కొనిపెట్టిన గుర్రం పిల్లతోనూ, మేక పిల్లతోనూ ఆడుకునేవాడు.

వారి స్నేహితుడి ఇంటిలో ఉన్న తోటలో తన మిత్రులందరితో కలసి కోతికొమ్మచ్చి ఆడేవాడు. అలా ఆడుతున్నప్పుడు వాళ్ళు కేకలు పెడుతూ, అక్కడ ఉన్న చంపక వృక్షం కొమ్మలు పట్టుకుని ఊగుతూ, కాళ్ళు తగిలించి తల్లక్రిందులుగా వేళ్ళాడుతూ, అక్కడ

నుంచి క్రిందికి దూకుతూ గోల చేసేవారు. ఆ స్నేహితుడి తాత ఆ చెట్టు మీద నుంచి వీళ్ళు పడిపోతారన్న భయంతో పాటు, ఆ చెట్టుకు పూసే చంపక పుష్పాలను ఆ పిల్లలు రాల్చివేస్తారనుకుని వారిని చెట్టు ఎక్కనివ్వకూడదని అనుకున్నాడు. వారిని భయపెట్టడానికి ఒక ఉపాయం ఆలోచించాడు. "ఒరేయ్! పిల్లలూ! ఆ చెట్టు మీద ఒక దయ్యం ఉంది. అది మిమ్మల్ని చంపేస్తుంది. పారిపోండి!" అని బెదిరించాడు. దయ్యం మాట వినగానే పిల్లలందరూ దూకి పారిపోయారు. బిలే కూడా చెట్టు దిగాడు. ఇది చూసి ఆ తాత తన పన్నాగం పారిందనుకుంటూ వెళ్ళిపోయాడు.

అయితే ఆయన అటు వెళ్ళగానే, స్నేహితులు ఎంత వద్దంటున్నా వినకుండా నరేంద్రుడు ఆ దయ్యం ఉందని చెప్పిన చెట్టునే ఎక్కి ఊగడం మొదలుపెట్టాడు. తన స్నేహితుల హెచ్చరికలను ఏమాత్రం లెక్క చేయలేదు. తన స్నేహితులతో, "ఒరేయ్! పిరికిపందల్లారా! పైకి రండి రా! ఎవరేది చెపితే అది వినడమేనా? ఈ చెట్టు మీదే కనుక దయ్యం ఉండివుంటే, ఈపాటికే నా గొంతు కొరికి చంపేసి ఉండేది కదా! కాబట్టి దయ్యమూ లేదు, గియ్యమూ లేదు! రండి రా!" అని ధైర్యం చెపుతూ పిలిచాడు. ఇది విని పిల్లలందరూ ధైర్యంగా చెట్టు ఎక్కారు. తిరిగివచ్చి చూసేసరికి పిల్లలంతా చెట్టు మీదే కనపడడంతో తన ఉపాయం పారలేదని తాత దిగాలు పడ్డాడు.

నరేంద్రుడు చిన్నప్పటి నుంచీ దేనికీ భయపడేవాడు కాదు. లోతుగా ఆలోచించి గానీ దేనినీ నమ్మేవాడు కాదు. పెద్దయిన తర్వాత, "ఆలోచించడమనే గొప్ప శక్తిని భగవంతుడు మనకు ఇచ్చాడు. అటువంటి శక్తిని ఉపయోగించకుండా ప్రతి దానినీ గుడ్డిగా నమ్మేవాణ్ణి భగవంతుడు క్షమించడు సుమా!" అని ఉద్బోధించాడు.

**భయము గియము లేదు దయ్య మసలు లేదు**
**తాత అరుపు ఉత్త డాంబికంబు**
**చెట్టు ఎక్కరండు చేతులు తట్టుడు**
**దయ్యమనగ పిరికితనము గాదె?**

✦ ✦ ✦ ✦ ✦



## 8. సంస్కృతాభ్యాసము

నరేంద్రుడికి ఆరవ ఏట అక్షరాభ్యాసం చేశారు. కానీ బడికి వెళ్ళి చెడు సహవాసాలు పడుతున్నాడని, బడి మానిపించి, ఇంట్లోనే చదువు చెప్పించారు. కొద్దిరోజులలోనే నరేంద్రుడు ఎన్నో విషయాలను నేర్చుకున్నాడు. ఎంతో కఠినమైన 'ముగ్ధబోధ' అనే వ్యాకరణ గ్రంథాన్ని కంఠస్థం చేశాడు.

నరేంద్రుడు రాత్రిపూట వాళ్ళ బంధువైన నృసింహ దత్తా అనే తాత దగ్గర పడుకునేవాడు. ఆయన సంస్కృతంలో పండితుడు. ఆయన వద్ద 'అమరకోశం' అనే సంస్కృత గ్రంథాన్ని నరేంద్రుడు సంపూర్ణంగా నేర్చుకున్నాడు.

ఆ రోజులలో వారి ఇంటికి ఎందరో పండితులు కూడా వచ్చేవారు. వారు అనేక విషయాల గురించి వాదనలు, చర్చలు జరిపేవారు. నరేంద్రుడు వారి వాదనలను విని, తన అభిప్రాయానికి విరుద్ధంగా ఉన్న వాటిని ఖండించేవాడు. అంత చిన్న వయసులోనే తన వాదనను సమర్థించుకుంటూ, ఎన్నో శ్లోకాలను ఉదహరించేవాడు!

మన భారతీయ సంస్కృతి ఎంతో ప్రాచీనమైనది. చాలా గొప్పది. ఆ గొప్పతనాన్ని తెలుసుకోవాలంటే మనం సంస్కృత భాషలోని గ్రంథాలు చదవాలి. సంస్కృత భాషను



నేర్చుకోవడం ఎంతైనా అవసరమనీ, సంస్కృత భాష ఎంత ఎక్కువ నేర్చుకుంటే, అంత ఎక్కువ గౌరవం దక్కుతుందనీ, తర్వాత కాలంలో అభిప్రాయపడ్డాడు.

సంస్కృతంబు, కీర్తి జనుచుండు వెనువెంట
ఆర్షజ్ఞానమెల్ల నందు గలదు ।
భరత ప్రాభవంపు పటిమ గోరెదవేని
సంస్కృతంబు బాగ నేర్వవలయు ॥

\+ + + + +

## 9. విద్యాభ్యాసం

నరేంద్రుడు చిన్నప్పటి నుండీ తల్లి చెప్పిన కథలు శ్రద్ధగా వినేవాడని మనం ఇంతకు ముందు చదివాము. అలా శ్రద్ధగా వినడం వలన, ఒక్కసారి విన్నా సరే, దేనినీ మరచిపోయే వాడు కాదు. ఆ కథలను మళ్ళీ పొల్లుపోకుండా చెప్పగలిగేవాడు. అలా చెప్పగలిగేవాణ్ణి ఏకసంతగ్రాహి అంటారు.

మనం చేస్తున్న పని మీదనే మనస్సును పూర్తిగా లగ్నం చేసి పనిచెయ్యాలి. ఒక పని చేస్తున్నప్పుడు దానిని మరచిపోయి, మిగిలిన పనుల గురించి ఆలోచించకూడదు. అంటే మనం ఏదైనా వ్రాస్తూ ఉంటే దాని గురించే ఆలోచించాలి. బొమ్మ గీస్తూ ఉంటే మనస్సంతా దాని మీదే ఉండాలి. ఆట ఆడుతున్నప్పుడు మనస్సంతా ఆటమీదే ఉండాలి. ఇలా మనం రోజూ చేస్తూ ఉంటే క్రమంగా మన ఏకాగ్రత పెరుగుతున్నట్టు మనకే తెలుస్తుంది. మనం చేసే పనులన్నీ మరింత బాగా చెయ్యగలుగుతున్నట్టు మనమే గమనిస్తాము. ఒకసారి ఏకాగ్రతను సాధించిన తర్వాత చాలా కొద్ది సమయంలోనే ఎన్నో విషయాలను నేర్చుకోగలిగే శక్తి మన మనస్సుకు కలుగుతుంది. ఇలాంటి ఏకాగ్రతతో నరేంద్రుడు తన పాఠాలను ఎలా నేర్చుకున్నాడో చూడండి.

ఒకసారి ఒక ఉపాధ్యాయుడు పాఠం చెపుతున్నాడు. నరేంద్రుడు ఇంట్లో బాగా అల్లరి చేసేవాడని ఇంతకు ముందే చెప్పుకున్నాం కదా! ఆ రోజు బడిలో కూడా తోటిపిల్లలతో మాట్లాడుతూ, గోల చేశాడు. ఉపాధ్యాయుడికి కోపం వచ్చింది. ఒక్కొక్క పిల్లవాడినే తాను చెప్పిన పాఠం నుంచి ప్రశ్నలు వేశాడు. ఎవరూ సమాధానం చెప్పలేదు. కానీ నరేంద్రుడు చక్కగా సమాధానాలు చెప్పాడు. అప్పుడు ఉపాధ్యాయుడు నరేంద్రుణ్ణి మాత్రం కొట్టకుండా, సమాధానాలు చెప్పని వారినందరినీ బెత్తంతో కొట్టబోయాడు. కానీ నరేంద్రుడు కలుగజేసుకుని, “మాస్టరుగారూ! గోల చేసింది నేను! నన్ను

కొట్టండి! వాళ్ళు గోల చెయ్యలేదు!" అన్నాడు. "అదేమిటిరా! నీవు పాఠం వింటూనే ఉన్నావుగా!" అని ఉపాధ్యాయుడు అన్నాడు. "అవునండీ! పాఠం వింటూనే, గోల కూడా చేశాను" అని సమాధానం చెప్పి అందరినీ ఆశ్చర్యపరిచాడు.

అతడికి అనేక సంస్కృత, ఆంగ్ల, బెంగాలీ గ్రంథాలు కంఠోపాఠంగా ఉండేవి. బ్రిటానికా విజ్ఞాన సర్వస్వాన్ని మొత్తం గుర్తు పెట్టుకుని తోటివారిని అబ్బురపరచాడు. "ఎక్కువ విషయాలను గుర్తుపెట్టుకోవడమే విద్య కాదు. ముందుగా మనస్సును ఏకాగ్రం చేయడం నేర్చుకోవాలి. అలా మనస్సును ఏకాగ్రం చేయడం నేర్చుకున్న తర్వాత, అటువంటి ఏకాగ్రమైన మనస్సుతో కావలసిన విషయాలను అతి త్వరగా సేకరించుకోవచ్చు" అని నేర్చుకోవడం గురించి తన అభిప్రాయాల్ని వెలిబుచ్చాడు.

విషయగ్రహణము మాత్రమె విద్య కాదు
మనసునేకాగ్రపరచుటె అసలు విద్య ।
ముందు లెస్సగ మనసును నిగ్రహించి
ఎట్టి విషయాలనైనను నేర్వవచ్చు ॥

✦ ✦ ✦ ✦ ✦



## 10. నిర్భయుడు : నరేంద్రుడు

నరేంద్రుణ్ణి 7వ ఏట ఈశ్వరచంద్ర విద్యాసాగర్ నిర్వహిస్తున్న బడిలో చేర్పించారు. ఆ బడిలో ఒక ఉపాధ్యాయుడు పిల్లలను చీటికీమాటికీ కొట్టేవాడు. అది చూచి నరేంద్రుడు ఒకసారి నవ్వాడు. ఇందుకు ఉపాధ్యాయుడికి కోపం వచ్చి, "నవ్వనని చెప్పు!" అని నరేంద్రుణ్ణి కూడా కొట్టాడు. కానీ నరేంద్రుడు అందుకు ఒప్పుకోలేదు. దాంతో మరింత రెచ్చిపోయిన ఉపాధ్యాయుడు రక్తం వచ్చేటట్లు అతడి చెవులు పిండివేశాడు. అయినా నరేంద్రుడు తొణకలేదు. "నన్ను కొట్టడానికి నువ్వెవరు? జాగ్రత్త!" అని ఉపాధ్యాయుణ్ణే అన్నాడు. ఇంతలో విద్యాసాగర్ ఆ తరగతి గదికి వచ్చాడు. నరేంద్రుడు నిర్భయంగా ఆయనతో జరిగినదంతా చెప్పాడు. ఇక ఆ బడిలో తాను చదవనని చెప్పి, వెళ్ళిపోవడానికి సిద్ధమయ్యాడు. అంతా విన్న విద్యాసాగర్ ఆ ఉపాధ్యాయుణ్ణి తీవ్రంగా మందలించి, నరేంద్రుణ్ణి ఊరడించాడు.

ఇలాగే మరొక ఉపాధ్యాయుడు నరేంద్రుణ్ణి భూగోళశాస్త్రం మీద ప్రశ్న వేశాడు. నరేంద్రుడు సరైన సమాధానం చెప్పాడు. కానీ ఉపాధ్యాయుడు సరిగా వినకుండా, నరేంద్రుడు చెప్పింది తప్పని గద్దించాడు. నరేంద్రుడు తాను చెప్పిన సమాధానం సరైనదేననీ, తప్పు కాదనీ చెప్పాడు. దానితో ఆ ఉపాధ్యాయుడు కోపంతో అతణ్ణి కఠినంగా దండించాడు. అయినా నరేంద్రుడు ఉపాధ్యాయుడి మాట ఒప్పుకోలేదు. తన సమాధానం సరైనదని అతడికి బాగా తెలుసు.

ఇంటికి వెళ్ళాక జరిగిన విషయాన్ని తన తల్లికి వివరించాడు. అతడి ధైర్యానికి ఆమె సంతోషించి అతణ్ణి ఇలా ప్రోత్సహించింది: "అబ్బాయీ! నీవు సత్యమని నమ్మిన దానిని చెప్పడానికి ఎన్నటికీ భయపడవద్దు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు అడ్డుపడినా సరే, నీవు నమ్మిన ధర్మమార్గం నుండి కొంచెమైనా తొలగవద్దు!"

అయితే, ఆ ఉపాధ్యాయుడు ఇంటికి వెళ్ళాక తన తప్పు తెలుసుకున్నాడు. తాను చేసిన పనికి సిగ్గుపడి, మరునాడు నరేంద్రుడికి క్షమాపణలు చెప్పాడు. మంచి గురువు అంటే అలాగే ఉండాలి మరి!

**తప్పు లేకున్న గురుడు దండించె నన్ను**
**అనగ నా సాధ్వి తనయున కనియెనిట్లు ।**
**'హరిహరాదులె వచ్చి నీ కడ్డపడిన**
**ధర్మమార్గము నిసుమంత తప్పకయ్య!'**

✦ ✦ ✦ ✦ ✦

## 11. సాహసోపేతుడు : నరేంద్రుడు

కలకత్తా నగరంలో ఒక ఉత్సవం జరుగుతున్నది. దాన్ని చూడాలని నరేంద్రుడు ఒక స్నేహితుడితో కలసి బయలుదేరాడు. అతడూ చిన్నవాడే. ఇద్దరూ అక్కడి వింతలు, విశేషాలను చూస్తూ తిరిగారు. అంతా చూశాక ఇక వెనుదిరిగి వస్తున్నారు.

వాళ్ళు అలా నడచి వస్తుండగానే చీకటి పడింది. హఠాత్తుగా వేగంగా పరిగెత్తుతున్న గుఱ్ఱపు గిట్టల శబ్దాన్ని నరేంద్రుడు విన్నాడు. వెనుక వస్తున్న తన మిత్రుని కోసం వెనక్కు తిరిగాడు. ఒక గుఱ్ఱపు బండి వేగంగా వీరి వైపే వస్తున్నది. ఆ బండిని గమనించకుండా నడుస్తున్న తన మిత్రుడు ప్రాణాపాయ స్థితిలో ఉన్నట్లు నరేంద్రుడు గ్రహించాడు. తన ప్రాణాలను ఏమాత్రం లెక్కచేయకుండా పరిగెత్తి, తన మిత్రుణ్ణి ప్రక్కకు లాగాడు. మరుక్షణంలో ఆ బండి వీరి ప్రక్కగా ముందుకు దూసుకు పోయింది. ఒక్క క్షణం ఆలస్యమైతే ఆ పిల్లవాడు ప్రాణాలతో ఉండేవాడు కాదు. ఇంటికి వచ్చాక విషయం తెలుసుకున్న తల్లి భువనేశ్వరీ దేవి, "ఎప్పుడూ మానవత్వం ఉన్న మనిషిగానే జీవించు!" అని చెమ్మగిల్లిన కళ్ళతో నరేంద్రుణ్ణి దీవించింది.



మరొకసారి నరేంద్రుడు ఒక చంటి బిడ్డను ఎత్తుకుని వెళుతున్న ఒక స్త్రీని రక్షించాడు.

ఏదైనా జంతువు వేరే జంతువు కష్టంలో ఉన్నట్టు చూసినా దానిని రక్షించదు. తన ప్రాణం కాపాడుకోవడానికి పారిపోతుంది. అయితే మనిషి తన తోటి ప్రాణిని రక్షించడం కోసం తన ప్రాణాలను కూడా లెక్కచేయడు. అటువంటి వాడే నిజంగా గొప్ప మనిషి. మనమందరం కూడా అలా తయారు కావడానికి ప్రయత్నించాలి.

పరుల కోసమె నదులెల్ల పారుచుండు
పరుల కోసమె వృక్షముల్ ఫలములిచ్చు ।
పరుల కోసమె ధేనువుల్ పాలనిచ్చు
ధీర పురుషులు బ్రతుకుట పరుల కొరకె ॥

\+ \+ \+ \+ \+



## 12. ధైర్యశాలి : నరేంద్రుడు

నరేంద్రునికి అప్పుడు పదేండ్ల వయసు. ఒకరోజు తన స్నేహితులతో జంతు ప్రదర్శనశాల చూద్దామని బయలు దేరాడు. అక్కడికి వెళ్ళడానికి పడవ ఎక్కి వెళ్ళాలి. అయితే వారు పడవ ఎక్కివెళుతుండగా, వారి స్నేహితులలో ఒకరికి పడవ ఊపు సరిపడక అక్కడే వాంతి చేసుకున్నాడు. ఇది చూచిన పడవ నడిపే వాడు పడవ పాడై పోయిందనీ, దాన్ని కడిగి బాగు చేయమనీ గోల పెట్టాడు. పిల్లలు "డబ్బులు ఇస్తాం! బాగు చేయించుకో" అని బ్రతిమాలారు. అయినా వాడు వినలేదు. "పడవ కడగకుండా ఎలా దిగుతారో చూస్తాను!" అని బెదిరించసాగాడు. ఇలా జరుగుతుండగా పడవ ఒడ్డును సమీపించింది. ఒడ్డు మీద ఇద్దరు ఆంగ్లేయ సిపాయిలు నడుస్తూ కనిపించారు. నరేంద్రుడు పడవ మీద నుంచి దూకి, వారిని చేరుకుని, వచ్చీరాని ఇంగ్లీషు మాటలతో వారికి విషయం చెప్పాడు. వారిని పడవ దగ్గరకు తీసుకు వచ్చాడు. వారిని చూస్తూనే పడవవాడు తోకముడిచి, పిల్లలను క్షేమంగా ఒడ్డు మీద దిగనిచ్చాడు.



గడ్డు పరిస్థితులు ఎదురైనప్పుడు భయపడి, తికమక పడకుండా, వాటిలో నుంచి బయటపడే మార్గం ఏమిటని ఆలోచించాలి. తప్పక మనకు ఏదోవొక పరిష్కారం దొరుకుతుంది. నిజానికి మనకు ఎదురైన సమస్య మనకు చేసే హానికన్నా మన భయం వల్లనే మనకు ఎక్కువ హాని జరుగుతుంది. ఎందుకంటే భయం మన మీద మనకున్న ఆత్మవిశ్వాసాన్ని చెదరగొట్టి, మన మనస్సును సరిగా ఆలోచించనివ్వదు. నిర్భయుడైన వాడు చక్కగా ఆలోచించి, సమస్యలను పరిష్కరించగలుగుతాడు.

**పడవ వాడు పడవ బాగు చేయమనుచు**
**బాధ పెట్టుచుండ, భయము వీడి ।**
**తీరమందు నడుచు నాంగ్లేయ యోధుల**
**పిలచి పడవవాని బింకమణచె ॥**

✦ ✦ ✦ ✦ ✦

## 13. సంగీత విద్వాంసుడు : నరేంద్రుడు

నరేంద్రుడికి ఎంతో ఇష్టమైన విషయాలు రెండు – క్రీడలు, సంగీతం. దేశ ద్రిమ్మరులైన 'బాల్' పాటగాళ్ళు వీరి ఇంటికి వచ్చేవారు. వారు పాడే ఆధ్యాత్మికమైన పాటలను నరేంద్రుడు ఎంతో ఆసక్తిగా వినేవాడు. వాటిలో లీనమైపోయేవాడు. బేణీ ఉస్తాద్ (బేణీ గుప్తా) అనే ఒక ప్రఖ్యాత సంగీత విద్వాంసుడి వద్ద సంగీతం నేర్చుకున్నాడు. తబలా, పఖావాద్యం (ధ్రుపద్ సంగీతంలో వాయించే మృదంగంలాంటి వాయిద్యం) కూడా వాయించడం నేర్చుకున్నాడు. నరేంద్రుడి తల్లిదండ్రులు కూడా పాడేవారు. నరేంద్రుడు చాలా చిన్నవయస్సులోనే వారితో కలసి పాడేవాడు.

తన గురువులతో సమానమైన సంగీతకళను నేర్చుకున్నాడని అందరిచేతా పొగడబడ్డాడు. యువకుడిగా కూడా నరేంద్రుడు కబీర్, మీరా మొదలైన సాధువుల పాటలు పాడేవాడు. అంతేకాక నరేంద్రుడి కళాదృష్టి ఎంతో గొప్పది. తర్వాత కాలంలో ఎలా పాడాలో వివరిస్తూ, "కేవలం రాగతాళాలే సంగీతం కావు. సంగీతం పాటలోని భావాన్ని వ్యక్తీకరించగలగాలి. నీరసంగా పాడే పాటను ఎవరూ మెచ్చుకోలేరు. పాట యొక్క భావం పాడేవాడిలో భావోద్రేకాన్ని కలిగించాలి. రాగతాళాలతో పాటు పాట యొక్క సాహిత్యానికి కూడా సమానమైన ప్రాముఖ్యతను ఇవ్వాలి. అది వినేవారి మనస్సును మేల్కొల్పాలి. అప్పుడే అది నిజమైన సంగీతమవుతుంది!" అని చెప్పాడు.

సంగీతం మన వ్యక్తిత్వం మీద గొప్ప ప్రభావాన్ని చూపుతుంది. మనం ఎటువంటి సంగీతాన్ని వింటున్నామన్న దానిని బట్టి మన వ్యక్తిత్వం మారుతుంది. ఈ విషయాన్ని గురించి మాట్లాడుతూ, "భేరీలు, తూర్యనాదాలతో వాయించే యుద్ధ సంగీతాన్ని చిన్నతనం నుండే వినాలి. ఆ వాయిద్యాలలో వినిపించే గంభీరమైన నాదాల వల్ల ధైర్యం, పౌరుషత్వం పెంపొందుతాయి. ఈ రోజుల్లో అందరూ వింటున్న డబ్బారేకుల సంగీతం మనల్ని బలహీనులుగా, నిర్వీర్యులుగా చేస్తోంది. ఇటువంటి సంగీతంతో మన దేశమే బలహీనుల దేశంగా మారిపోతోంది" అని చెప్పాడు.

**రాగతాళాల మేళమె పాట కాదు**
**శ్రోతలకు దాని భావము కూరవలయు ।**
**అనుచు కోవిదశిఖామణి నరేంద్రు**
**గురువులను మించిన ఘనత గాంచె ॥**

✦ ✦ ✦ ✦ ✦



## 14. మహావీరుడైన హనుమంతుడే మీకు ఆదర్శపురుషుడు!

హనుమంతుడంటే నరేంద్రునికి చాలా ఇష్టం. హనుమంతుడి బలమైన శరీరం, సూక్ష్మబుద్ధి నరేంద్రుణ్ణి ఎంతగానో ఆకర్షించాయి. మంచి ఆరోగ్యానికి, అపారమైన మేధస్సుకు బలమైన శరీరమే పునాది కదా! చిన్నప్పుడే ఈ విషయాన్ని గ్రహించిన నరేంద్రుడు ఒక వ్యాయామశాలను ప్రారంభించాడు. పిల్లలందరితో కలసి, తాను కూడా బస్కీలు, దండీలు సాధన చేశాడు. ఆపైన మరొక వ్యాయామశాలలో చేరి ఇంకా కష్టమైన వ్యాయామాలు, కుస్తీ నేర్చుకున్నాడు.





ఒకసారి వ్యాయామ ప్రదర్శన జరిగింది. నరేంద్రుడు అందులో పాల్గొన్నాడు. కుస్తీలో అందరినీ ఓడించి 'వెండి నెమలి' బహుమానాన్ని గెలుచుకున్నాడు.

కర్రసాము, గుర్రపుస్వారీ, ఈత కూడా నేర్చుకున్నాడు. గంగానదిని ఈ ఒడ్డు నుంచి ఆ ఒడ్డుకు ఈదగలిగే వాడు.

పెద్దవాడయ్యాక కూడా బలానికీ, ధైర్యానికీ ఎంతో ప్రాముఖ్యతను ఇచ్చి, వాటి అవసరాన్ని అందరికీ తెలియ జెప్పాడు. రోజూ తాను వ్యాయామం చేయడంతో పాటు తోటివారి చేత కూడా చేయించేవాడు. తాను స్వయంగా జీవితంలో చేసిన దానినే మనకు బోధించాడు. బలమే జీవనమనీ, బలహీనత మరణంతో సమానమనీ, బలహీనులు ఏదీ సాధించలేరనీ నొక్కి వక్కాణించాడు.

"నాయమాత్మా బలహీనేన లభ్యః" అన్న ఉపనిషత్తులలోని వాక్యాన్ని ఘంటాపథంగా ప్రచారం చేశాడు.

వివేకానంద స్వామిగా ఇలా చెప్పాడు: "శరీరం బలంగా లేనివారు మనస్సును స్వాధీనంలోకి తెచ్చుకోలేరు. వారు ఏకాగ్రత సాధించలేరు. బలమైన శరీరం ఉంటే బలమైన మనస్సు ఉంటుంది. శరీరం బలంగా లేని వారే చెడు అలవాట్లకూ, కోపానికీ



తేలికగా లొంగిపోతారు. శరీరం బలహీనంగా ఉన్నవారు వ్యాయామం, పుష్టికరమైన ఆహారం ద్వారా శరీరాన్ని బలమైనదిగా చేసుకుంటే వారి మనస్సు కూడా బలపడుతుంది. బలమైన మనస్సు వలన దృఢమైన సంకల్పశక్తి, పదునైన తెలివితేటలు అలవడతాయి. వీటి ద్వారా ఆత్మశక్తి సమకూరుతుంది."

"మన దేశస్థులందరూ హనుమంతుణ్ణి అనుసరించడం ద్వారా గొప్పతనం సాధించాలి. హనుమంతుడు తన ఇంద్రియాలను అదుపులో పెట్టుకున్నాడు. గొప్ప ధైర్యవంతుడు. సంగీతం మొదలు అన్ని విద్యలనూ నేర్చుకున్నాడు. తన రాజు అయిన రాముడి ఆజ్ఞను పాలించడం కోసం సముద్రాన్ని లంఘించడానికి సిద్ధపడ్డాడు. తనకేమైనా హాని జరుగుతుందేమోనని భయపడలేదు. రావణుడితో చేసిన యుద్ధంలో రాక్షస సైన్యాలను నాశనం చేశాడు. అటువంటి ధైర్యసాహసాలు, బుద్ధిశక్తి, ఇంద్రియ నిగ్రహం మనకు కావాలి."



బలమె జీవము దుర్బలమె చావు
బలమె సౌఖ్యము నిత్యజీవనము బలము।
ఉక్కు నరములు ఇనుప కండరములు
పిడుగు వంటి మనసు ఉండవలయు ॥

✦ ✦ ✦ ✦ ✦

## 15. కరుణామయుడు : నరేంద్రుడు

నరేంద్రుడు తన స్నేహితులలో ప్రతివొక్కరినీ ఎంతో ప్రేమించేవాడు. వారికి ఏదైనా కష్టం కలిగితే, అపరిమితమైన కరుణతో సహాయం చేసేవాడు. అందువలన స్నేహితులందరూ అతణ్ణి ఎంతగానో అభిమానించేవారు. ఎవరికి వారు, "నన్నే అందరి కంటే మిన్నగా నరేంద్రుడు ప్రేమిస్తున్నాడు!" అనుకునేవారు. ముఖ్యంగా బాధలలో ఉన్నవారిని చూస్తే, అతడి హృదయం ద్రవించేది. ఎంత కష్టమైనా, నష్టమైనా భరించి, తన శక్తికొద్దీ అటువంటి వాళ్ళను ఆదుకునేవాడు.



ఒకసారి వాళ్ళందరూ 'ఫోర్ట్ విలియం' అనే కోటను చూద్దామని బయలుదేరారు. కేరింతలు కొడుతూ, ఉత్సాహంతో కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. కానీ వారిలో ఒకరికి ఆ సమయంలోనే జ్వరం వచ్చింది. అతడు నడవలేక తూలిపోసాగాడు. స్నేహితులకు ఈ విషయం అర్థం కాలేదు. వారు అతణ్ణి అనుకరిస్తూ, ఏడిపించడం మొదలుపెట్టారు. అయితే నరేంద్రుడు ఆ స్నేహితుడి బాధను అర్థం చేసుకున్నాడు. వెంటనే ఒక బండిలో పిల్లవాణ్ణి వాడి ఇంటికి చేర్చి, తాను తిరిగి వచ్చి తన స్నేహితులను కలుసుకున్నాడు!



తోటి పిల్లవాడు ఏదైనా బాధలో ఉంటే మనలో చాలామంది నవ్వుతాము. కానీ అలా చెయ్యకూడదు. మనల్ని చూసి అందరూ అలా నవ్వితే మనమే ఎంతో బాధపడతాము కదా? ఎదుటివాడు ఏ పనిచేస్తే మనకు బాధ కలుగుతుందో తోటివారిపట్ల అటువంటి పనిని మనం చెయ్యకూడదు.

**బాలుడొక్కడు జ్వరముతొ బాధపడగ**
**గేలిసేయగ సాగిరి తక్కిన బాలురెల్ల ।**
**వాని గొనిపోయి ఇలుజేర్చి వేగవచ్చి**
**కరుణ వారాశి ఆ బిలే వారి గలిసె ॥**

✦ ✦ ✦ ✦ ✦

## 16. ధైర్యవంతుడు : నరేంద్రుడు

ఒకసారి నరేంద్రుడు, అతడి స్నేహితులు కలిసి ఒక ఉయ్యాల కడుతున్నారు. దాని కోసం రెండు దూలాలను నేలలో పాతారు. ఆ రెంటినీ కలుపుతూ మరో ఇనుప కమ్మీని పైకి ఎత్తి కట్టాలి. కానీ వారు చిన్నవారు కాబట్టి ఆ ఇనుపకమ్మీని ఎత్తలేకపోతున్నారు. దూరం నుంచి దీనిని చూస్తున్న ఒక నావికుడు వీరి మీద జాలిపడి సహాయం చేయడానికి ముందుకు వచ్చాడు. అందరూ కలిసి ఆ కమ్మీని ఒక గిలకకు కట్టి, పైకి లాగారు. కానీ దురదృష్టవశాత్తూ, కట్టిన తాడు తెగి కమ్మీ



ఆ నావికుడి తల మీద పడింది. అతడి తలకు గాయం అయి, రక్తం కారసాగింది. నావికుడు స్పృహతప్పి పడిపోయాడు. ఇది చూసిన మిగిలిన పిల్లలు భయంతో పారిపోయారు. కానీ బిలే, మరో ఇద్దరు స్నేహితులు మాత్రం ధైర్యంగా అక్కడే ఉండి, అతడికి సాయం చేశారు.

నరేంద్రుడు తన పంచె చింపి అతడికి కట్టుకట్టాడు. నెమ్మదిగా తన స్నేహితుల సాయంతో ఆ నావికుణ్ణి దగ్గరలో ఉన్న పాఠశాలకు తీసుకువచ్చాడు. విసినకర్రతో విసురుతూ, రకరకాల సపర్యలు చేశాడు. వైద్యుణ్ణి పిలిపించి వారం రోజుల పాటు అతడికి చికిత్స చేయించాడు. ప్రతి రోజూ అతడికి సేవ చేస్తూ, అతడికి స్వస్థత చేకూరేలాగా చేశాడు. అతడు వెళ్ళిపోయే సమయానికి, కొంత ధనాన్ని కూడా పోగుచేసి అతడికి బహుమతిగా ఇచ్చి, తమ కృతజ్ఞతలను తెలియజేశాడు.

తన స్నేహితులందరూ పారిపోయినా కూడా నరేంద్రుడు అక్కడే నిలబడి ఉన్నాడు చూశారా? అలాంటి ధైర్యం మనకు కూడా ఉంటే ఎంత బాగుంటుందో కదా! మనందరిలో గొప్ప శక్తి ఉంది. (దాన్ని మీరు దైవం అని కానీ, ఆత్మ అని కానీ పిలువవచ్చు.) అయితే, అది లోలోపల దాగి ఉంది. దానిని మనం బయటకు తీస్తే అది మన చేత గొప్ప గొప్ప పనుల్ని చేయిస్తుంది. దాని ద్వారా గొప్ప ధైర్యం, నిర్భయత్వం కలుగుతాయి. అయితే దానిని బయటకు తీయడం ఎలా? ముందు మనలో అది ఉందని తెలుసుకోవాలి. ఆ తరువాత, మనలోని పిరికితనం గురించి ఆలోచించడం మాని, మనలోని ఆ గొప్ప శక్తిని గురించి ఎల్లప్పుడూ గుర్తు చేసుకుంటూ ఉండాలి. చివరకు కలలో కూడా అది మనకు గుర్తుకు వస్తే చాలా మంచిది. అలా మనం దాని గురించి నిరంతరం ఆలోచించినప్పుడు ఆ శక్తి బయటకు వెలువడి మనం చేసే పనులన్నింటినీ మరింత చక్కగా చేసేందుకు తోడ్పడుతుంది. అన్నింటిలోనూ విజయం సాధించేలా చేస్తుంది.

**తోటి మిత్రులు భయముచే దౌడు తీయ**
**నిర్భయుండగు నా 'బిలే' నిలచి యచట ।**
**గాయముల చేత స్పృహ తప్పి గాసిపడిన**
**నావికుడు స్వస్థుడగు దాక సేవ చేసె ॥**

✦ ✦ ✦ ✦ ✦

## 17. అతిసాహసుడు : నరేంద్రుడు

నరేంద్రుడికి అప్పుడు పద్నాలుగేళ్ళు. ఒకసారి తన బంధువులతో కలసి నాటక ప్రదర్శనకు వెళ్ళాడు. నాటకశాల అంతా ప్రేక్షకులతో కిటకిటలాడుతోంది. రంగస్థలం చక్కగా అలంకరించబడి ఉంది. నాటక ప్రదర్శన మొదలయింది. ప్రేక్షకులందరూ నిశ్శబ్దంగా నాటకం చూస్తూ, అందులో లీనమైపోయారు.

ఇంతలో రంగస్థలం మీద కోర్టు బంట్రోతు ఒకడు ప్రత్యక్షమయ్యాడు. ఆ నాటకంలో నటిస్తున్న ఒక నటుని మీద న్యాయస్థానం జారీ చేసిన 'అరెస్ట్ వారంట్' అతడి చేతిలో ఉంది!



నిజానికి ఆ నటుడు చాలా రోజుల నుంచీ పరారీలో ఉన్నాడు. అతణ్ణి ఖైదు చేసే అవకాశం దొరికినందుకు ఆ బంట్రోతు సంతోషపడుతున్నాడు. ఇంతలో ఒక గద్దింపు! సింహగర్జన లాంటి ఒక స్వరం అక్కడ ఉన్న అందరినీ సంభ్రమంలో ముంచెత్తింది. "నాటకాన్ని చెడగొట్టడానికి నీవెవరు? అవతలకు ఫో!" అని ఆ స్వరం గర్జించింది! అప్పటికి తేరుకున్న ప్రేక్షకులు కూడా పైకి లేచి, ఆ బంట్రోతును వారించారు. గత్యంతరం లేక బంట్రోతు వెనుదిరిగాడు. నాటక ప్రదర్శన జయప్రదంగా ముగిసింది. ఇంతకీ ఆ సింహగర్జన చేసిందెవరు? నరేంద్రుడే!

**ధైర్య సాహసముల వెంట తరలు లక్ష్మి**
**పిరికిపందకు దక్కును 'పెద్ద అమ్మ' ।**
**అనెడు సత్యము నాటకమాడు నటుని**
**'కోర్టు వారంటు' అమలుగాకుండ చేసె ॥**

✦ ✦ ✦ ✦ ✦

## 18. కార్యసాధకుడు : నరేంద్రుడు

ఏదైనా పని మొదలుపెట్టినపుడు ఎన్నో అడ్డంకులు వస్తుంటాయి. ఏదోవొక ఆటంకం ఎదురు కాగానే చాలామంది చేస్తున్న పనిని మానివేస్తారు. కానీ నిజమైన కార్యసాధకుడు అధైర్యపడడు. మళ్ళీ ఉత్సాహాన్ని తెచ్చుకుని తాను అనుకున్నది సాధిస్తాడు. అంతదాకా విశ్రమించడు. నరేంద్రుడిలో ఆ లక్షణాలు పుష్కలంగా ఉన్నాయి.

ఒకసారి కలకత్తా రేవులోకి 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్' అనే నౌక వచ్చింది. ఆ పెద్ద నౌక లోపల ఎలా ఉంటుందో చూద్దామని నరేంద్రుడు కుతూహలపడ్డాడు. కానీ దాని కోసం తగిన 'ఆజ్ఞాపత్రం' (పర్మిట్) ఉంటే తప్ప లోపలికి అనుమతించరని తెలిసింది. చాలామంది దగ్గరలోనే ఉన్న కార్యాలయానికి వెళ్ళి ఆజ్ఞాపత్రం తెచ్చుకోవడం చూశాడు. పై అంతస్థులో ఉన్న ఒక అధికారి వాటిని జారీ చేస్తున్నాడు. తాను కూడా తీసుకుందామని అక్కడున్న వరుసలో నిలబడ్డాడు. కానీ గేటు కాపలాదారు, చిన్నపిల్లవాడు కదా అని నరేంద్రుణ్ణి లోనికి వెళ్ళనివ్వలేదు.

అంతమాత్రాన నరేంద్రుడు అధైర్యపడలేదు. "ఏం చెయ్యాలా?" అని ఆలోచించడం మొదలు పెట్టాడు. ఆ కార్యాలయ భవనం వెనుక వైపుకు వెళ్ళాడు. అక్కడ పైకి

వెళ్ళడానికి మెట్లు కనిపించాయి. గోడ దూకి, మెట్లు ఎక్కి పైకి చేరుకున్నాడు! ఆ అధికారితో ధైర్యంగా మాట్లాడాడు. చిన్న పిల్లవాడైనా అంత ధైర్యంతో, చక్కగా మాట్లాడుతున్న నరేంద్రుణ్ణి చూసి ఆ అధికారి అబ్బురపడ్డాడు. సంతోషంగా నరేంద్రుడికి ఆజ్ఞాపత్రం ఇచ్చాడు. అందరితో పాటు క్రిందికి వస్తూ, గేటు వద్ద ఆజ్ఞాపత్రం చూపాడు. కాపలాదారు ఆశ్చర్యంతో "ఎలా తెచ్చావు? లోపలికి ఎలా వెళ్ళావు?" అని అడిగాడు. "నా దగ్గర 'మ్యాజిక్' ఉంది!" అని నవ్వుతూ సమాధానం చెప్పి బయటకు వచ్చేశాడు. నరేంద్రుడి చాతుర్యానికి ఆ కాపలాదారు విస్తుపోయాడు.



'వేల్సు' నౌక చూడ వేడుక పడి 'బిలె'
ఆజ్ఞగొనగ లోని కరుగునపుడు ।
అడ్డుపెట్టిన కాపరి బమ్మరిడగ
చొచ్చి వెనుక నుండి తెచ్చె చీటి ॥

* * * * *

## 19. పురుషకారం : నరేంద్రుడు

నరేంద్రుడు 8వ తరగతికి వచ్చాక అతడి తండ్రి రాయ్‌పూర్ (ప్రస్తుతం ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర రాజధాని) వెళ్ళి, సుమారు 2 రెండు సంవత్సరాలు ఉండవలసివచ్చింది. అందు వలన ఆయన తన కుటుంబాన్ని వెంట తీసుకువెళ్ళాడు. ఆ సమయంలో తండ్రితో రకరకాల విషయాలు మాట్లాడడానికి నరేంద్రుడికి అవకాశం చిక్కింది. లోతుగా ఆలోచించదగిన అనేక విషయాల గురించి వారు గంటల తరబడి చర్చించేవారు.

ఒకసారి నరేంద్రుడు ఏదో విషయంలో పట్టింపు వచ్చి, తన తండ్రిని ఎద్దేవా చేస్తున్నట్టుగా, "మీరు నా కోసం ఏమి చేశారు?" అని అడిగాడు. "అద్దం ముందు నిలబడి, అందులో చూసుకో! నీ కోసం నేనేమి చేశానో అర్థమవుతుంది!" అని తండ్రి సమాధానం చెప్పాడు. మేధావి అయిన నరేంద్రుడు తండ్రి భావాన్ని చక్కగా గ్రహించాడు.





మరోసారి నరేంద్రుడు "ఈ ప్రపంచంలో మసలుకోవడం ఎలా?" అని తన తండ్రిని అడిగాడు. దానికి సమాధానంగా అతడి తండ్రి, "ఏమి వచ్చిపడినా సరే, ఎటువంటి పరిస్థితి ఎదురైనా సరే, ఆశ్చర్యపడవద్దు, తత్తరపడవద్దు!" అని బదులు చెప్పాడు. తరువాతి జీవితంలో ఎన్నో కష్టనష్టాలు, విపత్కరమైన పరిస్థితులతోపాటు, రాజభోగాలను కూడా నరేంద్రుడు అనుభవించాడు. వాటన్నింటినీ సమర్థంగా ఎదుర్కోవడానికి ఈ బోధ అతడికి చక్కగా ఉపయోగపడింది.

పిల్లలు తమ తల్లిదండ్రుల నుంచి ఆశించవలసినది ఆస్తిపాస్తులు కాదు. తమ శీలాన్ని ఉత్తమమైనదిగా తయారు చేసుకోవడానికి ప్రయత్నించడమే సంతానం బాధ్యత. అటువంటి వాతావరణాన్ని తల్లిదండ్రులు సమకూరిస్తే ఇక వారినుంచి కోరేదేముంటుంది? నిజానికి, మన శీలం మంచిది కానప్పుడు మనకు ఎంత ధనం, ఆస్తులు ఇచ్చినా అవన్నీ కర్పూరంలా హరించుకు పోతాయి. అన్ని విషయాలలోనూ మన మీద మనమే ఆధారపడడం నేర్చుకోవాలి. మన పనులను ఇతరుల చేత చేయించుకోవాలని చూడకుండా మనమే చేసుకోవాలి. మన ప్రవర్తన ద్వారా తల్లిదండ్రులకూ, ఉపాధ్యాయులకూ, తోటివారికీ ఎటువంటి కష్టమూ కలుగకుండా ప్రవర్తించాలి.

**భువిని మసలుట ఎట్లని తండ్రినడుగ**
**'ఏమియైనను తత్తరపడగవలదు!' ।**
**అనుచు పితరుడు చెప్పగ నాలకించి**
**తనదు జీవితమ్మున చేసి చూపె ॥**

\+ + + + +

## 20. త్యాగనిరతుడు : నరేంద్రుడు

నరేంద్రుడు పరుల కోసమే పుట్టాడు. అందువలన తన చిన్న ఇంటికి, తన చిన్న కుటుంబానికి పరిమితమై ఉండి పోలేదు. ప్రపంచం అంతా తన కుటుంబమే అనగలిగిన స్థాయికి ఎదిగాడు. 'ఉదార చరితానాం తు వసుధైక కుటుంబకమ్' అన్న సూక్తికి తగ్గట్టు మొత్తం ప్రపంచ ప్రజల్ని తన కుటుంబంగా భావించాడు. నిజానికి, సర్వాన్నీ త్యజించిన 'సన్న్యాసి' మాత్రమే ఆ స్థితికి చేరుకోగలడు.

నరేంద్రుడు చిన్నప్పుడు ధ్యానంలో కూర్చుని లేచినపుడు, శివుని మాదిరిగా తన వెంట్రుకలు కూడా జడలు కట్టాయేమోనని చూచుకునేవాడు!

తన చుట్టూ చేరిన స్నేహితులను, వాళ్ళ కుటుంబంలో 'ఎవరైనా సన్న్యాసి అయ్యారా?' అని ప్రశ్నించేవాడు. "అయ్యారు!" అని సమాధానం చెప్పినవారిని ఎక్కువగా ప్రేమించేవాడు. తన తాతగారు సన్న్యసించిన విషయం నరేంద్రుడికి తెలుసు. అందువలన తానూ సన్న్యాసాన్నే లక్ష్యంగా ఎంచుకున్నాడు. ఒక జ్యోతిష్కుడు అతని చేతిని చూచి, ఈ విషయాన్ని ధ్రువపరిచాడు. అది విని నరేంద్రుడు ఎంతో సంతోషించాడు.

ఇటువంటి మహోన్నతమైన లక్ష్యాన్ని నిరంతరం తన మనస్సులో ఉంచుకొని అతడు, తాను అనుకున్న ఉద్దేశాన్ని అమలు చేయగల నిర్భయుడైన యువకుడిగా తయారయ్యాడు.

వసుధ ఎవరికి సర్వదా వాసగృహమొ
సర్వజీవులు ఎవరికి సొంతవారొ ।
జీవసేవయె ఎవరికి శివుని సేవొ
అతడె ఈ నరేంద్రనాథుడను యతివరుండు ॥

* * * * *



## 21. నవయుగ నాయకుడు : నరేంద్రనాథుడు

నరేంద్రుడికి అతని తల్లి ఎన్నో ఉపయుక్తమైన బోధలు చేసింది. అందులో అతి ముఖ్యమైనది: "ఇతరుల స్వాతంత్ర్యానికి ఎన్నడూ అడ్డుపడవద్దు! అవసరమైనప్పుడు అఖండ ధైర్యసాహసాలు చూపించడానికి వెనుకాడవద్దు!" అలాగే తండ్రి కూడా కొన్ని ముఖ్యమైన భావనలు అతడికి నూరిపోశాడు. వాటిలో ప్రధానమైనది: "విషయాలను కంఠస్థం చెయ్యడమే విద్య కాదు. విషయాలను నేర్చుకోవడంతో పాటు, విమర్శనాశక్తిని వృద్ధి చేసుకోవటం (అంటే వాటిలోని మంచిచెడులను బేరీజు వేయడం) ముఖ్యం!" దీనజనుల పట్ల వాత్సల్యభావం కూడా అతడికి తండ్రి నుంచే సంక్రమించింది.

యువ నరేంద్రునికి పరమసత్యాన్ని (అంటే భగవంతుణ్ణి) తెలుసుకోవాలన్న తపన కలిగింది. ఆ స్థితిలో గురుదేవులు శ్రీరామకృష్ణ పరమహంస గారితో పరిచయం కలిగింది. ఆయన సాంగత్యంలో అతడి జీవితం మారిపోయింది. సర్వాన్ని త్యజించి సన్న్యాసిగా మారాడు. మానవ జీవితపు గమ్యం ఏమిటో కనుగొన్నాడు. పరమసత్యాన్ని సాక్షాత్కరించుకున్నాడు. ఆ పరమసత్యంలో మనస్సు ఐక్యం అయినపుడు సమాధి స్థితి కలుగుతుంది. ఆ స్థితిలో అనంతమైన ఆనందం కలుగుతుంది. అయితే ఆ స్థితికంటే గొప్ప స్థితి మరొకటున్నదని గురువు అయిన శ్రీరామకృష్ణ పరమహంస అతడికి చెప్పారు. అతడితో, "సమాధి స్థితి కంటే గొప్ప స్థితి ఉంది. నీవు అది చేరుకోవాలి. అదేమిటంటే, **అన్ని జీవులలోనూ ఆ పరమాత్మను చూడగలగడం!** అది సాధించిన తర్వాత నీవు ఇతరులకు మార్గదర్శనం చేయాలి!" అని బోధించారు.

శ్రీరామకృష్ణ పరమహంస పరమపదించిన తర్వాత నరేంద్రుడు ఇతర శిష్యులతో కలిసి సన్న్యాసం తీసుకున్నాడు. తన పేరును వివేకానంద స్వామిగా మార్చుకున్నాడు. భారతదేశం మొత్తాన్ని ఆసేతుహిమాచలం పర్యటించాడు. దేశంలోని అనేక ప్రాంతాలను కాలినడకనే ప్రయాణిస్తూ, సామాన్య ప్రజల కష్టాలను ప్రత్యక్షంగా చూశాడు. దానికి తోడు భారతదేశం యొక్క సంస్కృతి మూలాలనూ, దాని గొప్పతనాన్నీ తెలుసుకున్నాడు. భారతదేశపు సనాతన ధర్మాన్ని పాశ్చాత్యదేశాలలో ప్రచారం చేయడం ద్వారా వారికి కూడా దాని యొక్క ఫలాలను అందించి, అక్కడి ఆధునిక విజ్ఞానశాస్త్రాన్ని భారతదేశానికి తీసుకువచ్చి ఇక్కడి పేదరికాన్ని రూపుమాపాలని ఆకాంక్షించాడు. అందువలన విదేశాలకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు.

వివేకానంద స్వామి అమెరికాతో పాటు అనేక దేశాలు పర్యటించాడు. అమెరికాలో 1893లో జరిగిన షికాగో సర్వమతమహాసభలో మన సనాతన ధర్మం యొక్క గొప్పతనాన్ని గురించి సగర్వంగా చాటాడు. కేవలం మతసహనాన్ని చూపడం మాత్రమే కాక సనాతన ధర్మం అన్ని మతాలూ సత్యమేనని అంగీకరిస్తుందని తెలియజెప్పాడు. ఆ విధంగా భారతదేశపు గొప్పతనమేమిటో ప్రపంచానికి చూపాడు.



అమెరికా, ఐరోపా దేశాలలో విస్తృతంగా ఉపన్యసించాడు. విదేశీయులకే కాక, భారతీయులకు కూడా ఆధ్యాత్మిక భిక్ష పెట్టాడు. (అంటే దేవుడికి సంబంధించిన జ్ఞానాన్ని పంచిపెట్టాడు.) అన్ని జన్మల కంటే మానవజన్మ సర్వోత్కృష్టమైనదని ప్రకటించాడు.

కోల్‌కతాలోని బేలూరు అనే చోట "రామకృష్ణ మిషన్"ను స్థాపించాడు. తోటిమానవులలో భగవంతుడు ఉన్నాడని భావిస్తూ వారికి సేవచేయడమే నిజమైన మతధర్మం అని ప్రపంచానికి నేర్పాడు. త్యాగమొక్కటే ముక్తికి మార్గమని బోధించాడు.

స్త్రీలను ఎంతో గౌరవించేవాడు. వారికి సమానమైన విద్య, అవకాశాలు లేకుండా భారతసమాజం అభివృద్ధి చెందలేదని ప్రకటించాడు.

కొలంబో నుంచీ ఆల్మోరా వరకూ చేసిన ఉపన్యాసాలతో నిదురపోతున్న మన దేశాన్ని తట్టి లేపాడు. సమగ్రమైన విద్య, నైతిక జీవనాల ఆవశ్యకతను తెలియజెప్పాడు. దేశభక్తి భావనలను ప్రేరేపించడంతో పాటు, జాతీయత అనేదే అన్నిటికన్నా ముఖ్యమైనదనీ, అది లేనప్పుడు స్వాతంత్ర్యం వచ్చినా దానివల్ల ప్రయోజనం ఉండదనీ చెప్పాడు. కాబట్టి దేశప్రజలను బాధ్యత తెలిసిన పౌరులుగా తయారుచేసే విద్యకు ముందుగా ప్రాధాన్యమివ్వాలని చెప్పాడు.

ఆయన చెప్పిన ఉపన్యాసాలు, వ్రాసిన లేఖలు ఆంగ్లంలో తొమ్మిది సంపుటాలుగా గ్రంథస్థం చేయబడ్డాయి. (వాటి పేరు 'కంప్లీట్ వర్క్స్ ఆఫ్ స్వామి వివేకానంద.') ఆయన బోధనలను చదివిన మహాత్మా గాంధీ, సుభాష్‌చంద్ర బోస్, చక్రవర్తి రాజగోపాలాచారి వంటి ప్రముఖులు ఎంతో ఉత్తేజాన్ని, ప్రేరణను పొందారు. బాలలూ! మీరు కూడా పెరిగి పెద్దయ్యాక ఆయన బోధనలను చదివి స్ఫూర్తి పొందుతారు కదూ! మీరు దేశానికే గర్వకారణం కావాలి. మన దేశపు పూర్వవైభవాన్ని తిరిగి పైకి తేవాలి. తప్పక ప్రయత్నిస్తారు కదూ! ఏమంటారు?

దేశదేశాల భారత దివ్యభేరి
మారుమ్రోగించి గురుదేవుల మఠము గట్టె ।
ఖ్యాతి గాంచిన వివేకానంద స్వామి
అధివసించెడు గాత! నా హృదయమందు ॥

✦ ✦ ✦ ✦ ✦



